శ్రీః

జయ జగదంబికే

# శ్రీ మత్యవకయజ్ఞానందలహరి



శ్రీమచ్ఛంకర భగవత్పాదప్రణీతా


అనువాదకులు — సంపాదకులు ;

వ్యాకరణ, వేదాన్తవిశారద,

పౌరాణిక చక్రవర్తి, గీతావ్యాఖ్యాతృ చక్రవర్తి,

భాగవతార్థ ప్రతిపాదక.

బ్రహ్మశ్రీ చిఱ్ఱావూరి అనన్త పద్మనాభశాస్త్రి

అగ్నిహోత్రాలు - అనువాదశ్రేణి

---

ప్రాప్తిస్థానము:

శ్రీ చిట్టావూరి అనన్తపద్మనాభశాస్త్రి,

అగ్రహారం - ఏలూరు.



చీమకుర్తి మల్లికార్జునరావు దంపతులు

# పీఠిక

అంబికా ప్రతిష్ఠితుస్సాదీయతాం సకలం సుఖం

ఆర్యులారా!

సాక్షాత్తు శివుడు శంకర భగవత్పాదుల వారయి యవతరించి ఉపనిషత్తులకు, బ్రహ్మ సూత్రములకు, శ్రీ మద్భగవద్గీతకును, భాష్యములను రచించిరి. మఱియు భక్తికి సంబంధించిన స్తోత్రములను, వేదాంత ప్రకరణ గ్రంథములను రచించిరి. సర్వకష్టములు పోవుటకు దుర్గ నారాధించుట సంప్రదాయము పాండవు లజ్ఞాతవాసమునకు ముందు దుర్గను కొలిచిరి అజ్ఞాతవాసములో బయటపడకుండ దుర్గ వరము లిచ్చి వారిని రక్షించి నటుల భారతమందున్నది శ్రీకృష్ణుడు తనకు స్యమంతకమణి నపహరించి నటుల వచ్చిన నిందను పోగొట్టుకొనుటకు ఒక గుహలో ప్రవేశించి జాంబవంతునితో యుద్ధము చేసెను. అటనుండి వచ్చుటకు నాలస్యము కాగా వసుదేవాదులు దుర్గను కొలిచిరి. "శ్రీకృష్ణుడు జాంబవతి యనెడి కన్యను స్యమంతకమణిని తీసికొని సుఖముగా వచ్చును" అని దుర్గ వరములిచ్చినటుల వ్యాసులవారు చెప్పిరి. గాన దుర్గ యన్ని కష్టములను హరించును. నవదుర్గలుకలరు.

ఆంధ్రలో కనకదుర్గయనెడి దేవి కృష్ణాతీరములో విజయవాడలో నున్నది. ఆ జగజ్జననిని శ్రీమచ్ఛంకరభగవత్పాదుల వారు 103 పద్యములతో వర్ణించిరి. దానిని గురువువద్ద నుపదేశ మొంది రాత్రిపారాయణము చేయుచో సర్వకష్టములు తీరి సర్వసుఖములను పొందుదురు. సంస్కృతము రానివారు ఉపదేశముకూడ లేకయే నేను వ్రాసిన తెనుగు తాత్పర్యమును రాత్రి నలుబదిరోజులు చదువుకొనినచో సర్వ సుఖములు వచ్చును.

శ్రీ శంకరో మూలకారీ
లక్ష్మీనాథస్తు పాలకః
భాషాకారీతు లక్ష్మీజః
జీయాత్ స్తోత్రం సదాభువి.

ఇట్లు,

అనువాదకుడు



అర్హః

శ్రీ గురుగణేశ శారదాభ్యోనమః

శ్రీ చిమకుర్త్యాఖ్య సువైశ్యవంశే
రామార్య శ్రేష్ఠీ నిజధర్మనిష్ఠః
శ్రీవేంకటాంబాఖ్య సునామధేయా
సాతీవ సాధ్వీ శుభధర్మనిష్ఠా

తా॥ శోభావంతమైన చీమకుర్తి యను వైశ్యవంశమున స్వధర్మమగు వ్యాపారమును చేసికొనుచు రామయ్య శ్రేష్ఠి యుండెను. శ్రీమతి వెంకటమ్మ యాయన ధర్మపత్ని, ఆమె శోభాయుక్తమగు ధర్మనిష్ఠ గల్గిన యట్టిది.

మల్లికార్జున వరప్రసవౌ తౌ
వీరభద్ర శుభనామ కళత్రం
తస్యనామ సతతం జనసంఘే
దాతృమధ్య కథితం శుభకారి

తా॥ ఆ దంపతులు మల్లికార్జున శ్రేష్ఠి యను మంచి పుత్రుడుగలవారు, ఆమల్లికార్జునుని భార్య వీరభద్ర యను శుభనామధేయము గలది. ఆమల్లికార్జునుని నామము జనులలో దాతల నడుమ శుభకారిగా నెన్నబడును.

రామకృష్ణానందశ్రేష్ఠః
గాంధీరాజా చ మధ్యమః
శ్రీకృష్ణమోహనశ్చైవ
పుత్రత్రయమభూత్తయోః

తా॥ వీరికి రామకృష్ణానందరావు పెద్దకుమారుడు, గాంధీరాజా మధ్యముడు, శ్రీకృష్ణమోహనరావు తృతీయుడు, వీరు ముగ్గురు వీరభద్రా మల్లికార్జునుల సంతానము.

వీరభద్రేతి తద్భార్యాస్వ
స్వర్ణదుర్గాఖ్య పుస్తకే
ముద్రణార్థ ద్రవ్యదానాత్
రామో రక్షతు తత్కులం

తా॥ వీరి ధర్మపత్ని వీరభద్రగారు శ్రీ కనకదుర్గానందలహరిని ముద్రించుటకు ద్రవ్యమొసంగిరి వీరిని, వీరి వంశమును శ్రీరామచంద్రుడు రక్షించుగాక.

వీరభద్రాఖ్యదారైశ్చ
పుత్రపౌత్రాది కైర్యుతః
మల్లికార్జున గుప్తోసౌ
స్వాయురారోగ్య మాప్నుయాత్

తా॥ వీరభద్రయనెడి భార్యతోను పుత్రపౌత్రాదుల తోడను గూడిన మల్లికార్జున గుప్తగారు ఆయురారోగ్యములతో గూడి కనకదుర్గాదేవి ప్రసాదము వలన సుఖింతురుగాక.

శ్రీ శివాయ గురవేనమః

# శ్రీ కనకదుర్గానందలహరీ

శ్లో. వందే గురుపద ద్వంద్వమవాఙ్మానస గోచరం
రక్తశుక్ల ప్రభామిశ్రమ తర్క్యం త్రైపురంమహః

తా॥ అవాఙ్మానస గోచరమగు ఎఱుపు, తెలుపు కాంతు లతో గలసిన ఊహింప శక్యముగాని మూడు శరీరములందున వెలుగు రూపమగు గురుపదద్వంద్వ మును నమస్కరించుచున్నాను. ఎఱుపనగా పార్వ తెలుపనగా శివుడు

శ్లో. అఖండ మండలాకారం విశ్వం వ్యాప్య వ్యవస్థితం
తత్పదం దర్శితం యేనతస్మై శ్రీగురవేనమః

తా॥ ఖండములుగాని యాకారమగు ప్రపంచమును వ్యాపించియున్న బ్రహ్మ పదార్థమును చూపిన గురువుకు నమస్కారము.

1. శ్లో. శివే సేవాసక్తాశ్రిత భరణకార్యైక చతురే
శిరోభి స్త్రయ్యానాం చిర వినుత కళ్యాణచరితే
స్మితజ్యోత్స్నా లీలారుచిర రుచిమచ్చంద్రవదనే
జగన్మాతర్మాతర్జయ కనకదుర్గే భగవతి

తా॥ ఓ మంగళ స్వరూపిణీ! సేవాసక్తులగు యాశ్రయించిన వారిని భరించుట యనెడి కార్యమందు ముఖ్యముగా చాతుర్యము గలదానా, వేద శిరస్సులగు నుపనిషత్తులచే చిరకాలము స్తుతింపబడు కళ్యాణ చరితము గలదానా, చిరునగవు యనెడి వెన్నెలయొక్క లీలచే సుందరమగు కాంతి గలిగిన చంద్రునివంటి ముఖముగలదానా జగన్మాత, మాత, భగవతి, కనక దుర్గ, నీవు సర్వోత్కృష్టముగా నుండువుగాక.

2. శ్లో. నగాధీశః కన్యే నలినదళ సంకాశనయనే
సుచిత్రైర్గంధర్వైస్సుర యువతిభిశ్చారు చరితే
అగస్త్యై రామూన్యైరపి గుణనికాయై ర్విలసితే
జగన్మాతర్మాతర్జయ కనకదుర్గే భగవతి

తా॥ హిమవంతుని కూతురా, తామర రేకులతో సమానమగు నేత్రములు గలదానా, గంధర్వులచేతను, దేవతా స్త్రీలచేతను సంగీతములచే సేవింపబడు

దానా, వేదములచే కొనియాడబడుచున్న దేవగణ సము
దాయములచే ప్రకాశించుచున్నదానా, జగన్మాత మాత,
భగవతి, కనకదుర్గ, నీవు సర్వోత్కృష్టముగ నుండుమా.

3. శ్లో. నిజశ్రేయస్కామై ర్నిటలఘటితాం చత్కరపుటై
స్తువద్భిస్సానందం శ్రుతిమధురవాచాం విరచనైః
అసంఖ్యై ర్బ్రహ్మాద్యైరమర సముదాయైః
పరివృతే
దయాకర్తవ్యా తేమయి కనకదుర్గే భగవతి

తా॥ తమ శ్రేయస్సును కోరుకొనువారును ఫాలమందుంచ
బడి ప్రకాశించుహస్తసంపుటములచే ఆనందముతో
వేదములచే మధురములగు వాక్కుల రచనలచే
స్తోత్రమొనర్చు వారునగు నసంఖ్యులగు బ్రహ్మా
ద్యమర సముదాయములచే పరివారింపబడిన కనక
దుర్గా, భగవతి, నాయందు నీ దయ చేయదగినది.

4. శ్లో. భవత్పాదన్యాసోచిత కనకపీఠ పరిసరే
పతంతస్సాష్టాంగం ముదితహృదయా
బ్రహ్మఋషయః
నవాంఛంతి స్వర్గం నచకమలసంభూత భవనం
నవాముక్తేర్మార్గం నను కనకదుర్గే భగవతి

తా॥ నీయొక్క పాదముల నుంచుకొనుటకు తగిన బంగారు పీఠముయొక్క ప్రాంతమందు సాష్టాంగముగా పడి నమస్కరించు బ్రహ్మాదులు స్వర్గమును, బ్రహ్మ లోకమును, ముక్తిమార్గమునుగూడ కోరుటలేదు. ఓ భగవతి, కనకదుర్గ నీసన్నిధి యంత మహిమ గలది.

5. శ్లో. శచీ స్వాహాదేవీ ప్రముఖ హరిదీశాన రమణీ
మణీహస్తన్యస్తైర్మణి ఖచితపాత్రై రనుదినం
సనంగీతం నీరాజితచరణ పంకేరుహ యుగే
కృపాపూరం మహ్యాందిశ కనకదుర్గే భగవతి

తా॥ శచీదేవి, స్వాహాదేవి మొదలగు శ్రేష్ఠులగు దిక్పాలకుల భార్యలయొక్క హస్తముల యందుంచబడిన మాణిక్య ఖచితములగు పాత్రలచే ప్రతి దినమందు సగీతముగా నీ రా జ న చేయబడిన పాదపద్మ ద్వంద్వముగల, కనకదుర్గ. భగవతి, నీ దయా ప్రవాహమును నా కొసంగుము

6. శ్లో, ప్రవర్షత్యశ్రాంతం అఖిలగుణ మభీష్టార్థ నిచయం
స్వరూపధ్యాతౄణాంచి కురనికురుంబంతవ శివే
అపామేకం వర్షం వితరతికదాచి జ్జలధరో
హ్యయోస్సామ్యం కింస్యాన్ననుకనకదుర్గే భగవతి

తా॥ ఓ మంగళ స్వరూపిణీ! నీ ముంగురులను సదా ధ్యానించు వారలకు అనేకములగు కోరికలను ముంగురులే వర్షించును. మేఘుడు కేవలము జలమునే వర్షించును. ఈ రెంటికి సామ్య మెట్లు గల్గును? ఓ భగవతి! కనకదుర్గ!

7. శ్లో. కృశాంగం స్వారాతింటు హీనకరమా వృత్యైతరసా
స్థితంమన్యే ధన్యేతి మిరనికరంతే కచభరం
సహాయం కృత్వాయః హరమనసి మోహాంధతమసం
వితేనే కామశ్శ్రీమతి కనకదుర్గే భగవతి

తా॥ చీకటిగుంపు నీ కేశములయి తన శత్రువగు చంద్రుడు చిక్కినపుడు అవరించినదని, ఓ ధన్యురాలా తలచుచున్నాను ఈ కేశముల నాశ్రయించి మన్మథుడు శివుని మనస్సునందు మోహమనెడి చీకటికి కలుగ చేసెను. మనసునుండి చంద్రుడు పుట్టినందున చీకటి విరోధియగు చంద్రునికి తండ్రియగు శివుని మనస్సులో మోహమును ముంగురులచేకలిగించెను

8 శ్లో. తమో నామ్నాసమ్యగ్గళిత పునరుద్వ్యాంత రుచిర
ప్రభాశేషంభానోరివ తరుణి మానంధృతవతః
త్వదీయే సీమంతే కృతపదమిదం కుంకుమ రజో
వసేదశ్రాంతం మేహృది కనకదుర్గే భగవతి

తా॥ ఓ కనకదుర్గ! ఓ భగవతి! రాహువనుచు తమస్సనెడి పేరు గలదు, తమస్సనగా చీకటి యనెడి యర్థము గలదు పాపిడియందు కుంకుమను దుర్గ యలంక రించుకొనినది. ఆమె శిరస్సుయందు కేశములు నల్లగా నున్నవి. తమస్సనెడి పేరుతో రాహువు ఆమె నెత్తియందు కేశరూపముతోనుండి సూర్యుని మ్రింగి సూర్యునియొక్క కొంచెము కాంతిని కక్కినాడా యన్నటుల నున్న కుంకుమపాడి ఎల్లప్పుడు నా హృదయమందుండుగాక

9\. త్రిలోకీవై చిత్రీ జనక ఘనసౌందర్య సదనం
వీరాజత్కస్తూరీ తిలకమపి కంఠే విజయతే
యదాలోక వ్రీడాకుపితఇవజూటే పశుపతే
ర్విలీనో బాలేందుర్నను కనకదుర్గే భగవతి

తా॥ త్రిలోకములకు ఆశ్చర్యము కలిగించు ఘనమగు సౌందర్యమునకు నివాసమగు ప్రకాశించు కస్తూరీ తిలకము నీకంఠమందు సర్వోత్కర్షగ నున్నది. తనకంటె సుందరముగనున్న తిలకమును చూచి చంద్రుడు శివుని జటాజూటమందు దాగినాడు. ఓ కనకదుర్గ, భగవతి ఏమాశ్చర్యము ?

10. శ్లో. పరాభూత శ్చైశాగ్నిశనయన కీలావిలసనా
ద్విసృజ్య ప్రాచీనం భువనవినుతం కార్ముకయుగం
హరంజేతుంత్వద్ భ్రూచ్ఛల మపరబాణాసనయుగం
స్మరోధత్తే సర్వేశ్వరి కనకదుర్గే, భగవతి

తా॥ శివుని మూడవ కంటియొక్క యగ్నిజ్వాల వలన పరాభవమును పొంది లోకప్రసిద్ధమగు ప్రాచీన మయిన ధనుస్సులయొక్క ద్వయమును విడిచి శివుని జయించుటకు నీకనుబొమ్మ లను రెండుధనుస్సులను మన్మథుడు ధరించుచున్నాడు, ఓకనకదుర్గ, భగవతి, మరుని ధనుస్సులతో సమముగా దుర్గయొక్క కను బొమ్మ లున్నవనుట

11. శ్లో. త్వదీయభ్రూవల్లీచ్ఛల మదన కోదండయుగళీ
సమీపే విభ్రాజత్తనువిపులం నేత్రయుగళం
విజేతుం స్మారాతిం వికచనవ నీలోత్పలశర
ద్వయం తేనానీతంఖలు కనకదుర్గే, భగవతి

తా॥ నీయొక్క కనుబొమ్మలనెడు మిషచేయున్న మన్మ థుని ధనుస్సుల రెంటి సమీపమందు ప్రకాశించు విపులమగు నీ నేత్రద్వంద్వము తన శత్రువగు శివుని

జయింపుటకు పిలిపించిన నల్లకలువల జాట మన్మథునిచే తీసుకొనిరాబడినదా యన్నటుల యున్నది. ఓ కనకదుర్గా, ఓ భగవతి

12 శ్లో. దరిద్రం శ్రీమంతం జరఠమబలానాం ప్రియతమం
జడం సంఖ్యావంతం సమరచలితం శౌర్యకలితం
మనుష్యం కుర్వంతోమర పరివృఢం నిత్య సదయాః
కటాక్షాస్తే కార్యామయి కనకదుర్గే, భగవతి

తా॥ దరిద్రుని శ్రీమంతునిగాను, వృద్ధుని స్త్రీలకు ప్రియతమునిగాను, జడుని పండితునిగాను, యుద్ధమునందు భీతుని శూరునిగాను, మరణముగల మనుష్యుని అమరశ్రేష్ఠునిగాను చేయు నిత్యదయతో గూడిన నీకటాక్షములు నాయందుంచుము ఓ కనకదుర్గ, భగవతీ.

13. శ్లో, పురారాతేర్భార్యాః కుసుమశరతూణీర గళితా
నతానాం సంత్రాణే నిరవధి సుధావీచినిచయాః
వియద్గంగాభంగా బహుదురితజాలావృతిముతాం
కటాక్షాస్తే కార్యామయి కనకదుర్గే భగవతి

తా॥ నీ స్ఫురించిన కటాక్షములు, మన్మథుని యొక్క
తూణములోనున్న బాణములను సమ్మోహింపజేయు వానికి
హ్రస్వతేవి యమృత తరంగ సముదాయములై
బహు పాపజాలములతో నూగిన వానికి ఆకాశ
గంగాతరంగములగుచున్నవి. వానిని నాయం
దుంచుమమ్మా, ఓ కనకదుర్గ! భగవతి!

14. శ్లో. దరిద్రాణాం కల్పద్రుమ సుమమకరందోదకఝరా
అవిద్యాధ్వాంతానాం మిహిరకిరణానాం విహృతయః
పురాపుణ్యశ్రేణీషు లలితలతా చైత్రసమయాః
కటాక్షాస్తే కారుణ్యమయి కనకదుర్గే! భగవతి!

తా॥ అమ్మా! నీ కటాక్షములు దరిద్రులకు కల్ప వృక్ష
పుష్ప మకరంద జలప్రవాహములును, అజ్ఞానమనెడి
చీకట్లకు సూర్యకిరణ విహారములును పూర్వపుణ్య
పంక్తియనెడు సుందరమగు లతలకు చైత్రి మాస
ములై (అనగా వసంత ఋతువులో మొదటి మాస
మనుట) యగుచున్నవి. ఓ కనకదుర్గ! భగవతి!

15. శ్లో. గజేంద్రోత్సాహాంతః కనకమణి నిర్మాణ విలసా
రథం తచ్ఛత్రంతో బలయుత భటాంతః ప్రతిదినం
స్వభక్తానాం గేహాంగణ భువి చరంతో నిబిడమాః
కటాక్షాస్తే కారుణ్యమయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! నీ కటాక్షములు ఏనుగులయి గుఱ్ఱములై, బంగారమును, మణులను నిర్మించినవై రథములై, శ్వేతచ్ఛత్రములయి నీ భక్తుల గృహ మందలి ముంగిట వాకిళ్ళయందు అసమానములై సంచరించుచున్నవి. వాటిని నాయందుంచుమా !

16 శ్లో. పురారాతే రంగం పులకన్ని కురుం గైః పరివృతం మునివ్రాతైర్ధ్యాతం ముకుళయుత కల్పద్రుమ నిభం శ్రయంతశ్చానందం విచలదళిపోతా ఇవచిరం కటాక్షాస్తే కార్యామయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ ! భగవతి, నీ కటాక్షములచే శివుని శరీరము పులకాంకురములతో గూడి మొగ్గలతో నున్న కల్పవృక్షముతో సమానమయినదయి ముని సంఘములచె ధ్యానము చేయబడినవి. ఆనంద ముతో శివుని శరీరమందు పడిన నీ కటాక్షములు చలించు తుమ్మెద పిల్లలవలె నున్నవి. వాటిని నాయందుంచుమా !

17. శ్లో. హరి బ్రహ్మేంద్రాద్యైః శ్రుతివిదిత గీర్వాణనిచయై ర్వసిష్ఠ వ్యాసాద్యైరపిచ పరమబ్రహ్మ ఋషిభిః సమ సెరాశాస్యాస్సకల శుభదాయ ద్విహ్వాతియః కటాక్షాస్తే కార్యామయి కనకదుర్గే! భగవతి!

తా। హరిబ్రహ్మేంద్రాదిక వేద ప్రముఖ దేవతా సంఘములు
చేతను వసిష్ఠ వ్యాసాది పరమబ్రహ్మ ఋషులచేతను
అనవరతము కోరబడిన అంతటి శుభములను చేకూర్చు
నీకటాక్షములను నాయందుంచుము. ఓ కనకదుర్గా!
భగవతి !

18. శ్లో. విరించిర్యన్నోర్యా ద్విరచయతి లోకాన్ ప్రతిదినం
విధత్తే లక్ష్మీశో వివిధ జగతాం రక్షణ విధిం
లలాటాక్షోప్యద్ధా భవ దఖిల సంహారకరణే
కటాక్షాస్తే కార్యామయి కనకదుర్గే! భగవతి!

తా। ఓ కనకదుర్గా! భగవతి! వేనిచే బ్రహ్మ ప్రతి దిన
మును సర్వలోకములను రచించుచున్నాడో విష్ణువు
వేటిచే జగమును రక్షించుచున్నాడో శివుడందరిని
సంహరించుచున్నాడో ఆ కటాక్షములను నాయం
దుంచుము.

19. శ్లో. ఉరోభాగే శంభోర్వ్యకచ నవనీలోత్పల దళ
స్రజం సంగృహ్ణాంతో మృగమదర సంపాలఫలకే
శిరోగ్రే గంగాయాం రవిదుహితృ సందేహ జనకాః
కటాక్షాస్తే కార్యామయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! నీ నల్లని కటాక్షములు శివుని వక్షస్థలమందు వికసించిన నల్లకలువల దళముల మాలికలయి, శివునిఫాల ప్రదేశమందు కస్తూరీ తిలక రూపములయి శివుని శిరస్సునందలి గంగ యందు యమునానదీ సందేహమును పుట్టించు చున్నవియు యున్నవి. వాటిని నాయందుంచుము.

20. శ్లో. మదీయ శ్రీలీలాహరణ పటుపాటచ్చరమితి
కృతాహం తాగంతుం శ్రుతి విమల నీలోత్పలమివ
తదభ్యర్ణం యాతాస్సహజ నిజనైశిత్య కలితాః
కటాక్షాస్తే కార్యామయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! సహజముగా, తీక్ష్ణముగా నుండి చెవుల వఱకు వెడల్పుగల నీ నేత్ర కటాక్షములు మాయొక్క శోభా విలాసముల నపహరించు టకు దొంగ యని చెవులయం దలంకారముగా నున్న నల్లకలువను తెఱుముటకు అహంకారముతో వెళ్ళుచున్నవా అన్నటుల నున్నవి. వాటిని నాయందుంచుము

21 శ్లో॥ కళంకీ సూనాం శేవహారి స్మరశత్రోం నిత్యమనసః త్వ
త్వాముఖం చంద్రం దర్శా త్స్వాంతినవసన చంద్రాచ్ఛ్రితమిదం
స్థితం జీవం జీవద్విగతయువతి మత్వా నయన యో
ర్ద్వయంగం కామారాతేస్సతి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కామమునకు శత్రువగు శివునిసతీ! మచ్చగలచంద్రుడు అమావాస్యయందు చిక్కును అని చంద్రుని విడిచి ఆచంద్రునిలోగల జీవుడు దోషములేని నీ ముఖ చంద్రునిలో ప్రవేశింపగా, ఆ జీవుడొక కన్నులోను చంద్రునిలోని జీవుడొక కన్నులోనున్నారని తలచు చున్నాను. కనకదుర్గ! భగవతి

22 శ్లో॥. ప్రసాదోమయ్యాస్త్రీముఖః సహజం సౌరభమిదం
తులామేమైత్యేత్యం విరత వివాదాభిరతయో:
నివృత్తానేదా నీమపిచరిపుః తాస్త్వాన లినయో
స్త్వదాస్యంద్దృష్ట్వా శ్రీమతి! కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ శ్రీమతి! కనకదుర్గ! భగవతి! నీ ముఖమందలి పరిమళము పద్మమందలి పరిమళముతో సమముగా నున్నదని పద్మమున్ను, నాయందున్న ప్రసాద గుణము, ఆమె ముఖమందున్న ప్రసాద గుణము

సమానమని చంద్రసూర్యులు ఇప్పటికి నీ ముఖమును చూచి శంకించుచున్నారు. కనుకనే పరస్పర దర్శ నాయన-తిరోధానములు చేయుచున్నారు.

23. శ్లో. మనోజాతాటంకౌ ప్రమథనిజ రూపౌ తవ శివే
కపోలే ఛాయాభ్యాం మమ సకల కల్యాణ జనకౌ
శ్రితశ్రీతాటంకౌ కన్యాతయురుచయో యత్రమిళితా
సుధారుక్సూర్యాభా ఇవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ మంగళస్వరూపిణీ! కనకదుర్గ! భగవతి! మన్మథుని యుద్ధములతో సమానమగు చెక్కిళ్ళు నాకు సకల శుభములను చేకూర్చుగాక. కమ్మపువ్వులయొక్క కాంతులు చెక్కిళ్ళయందుపడి సూర్యచంద్రులవలె ప్రకాశించుచున్నవి.

24. శ్లో. త్రయీస్తుత్యే నిత్యే తవవదన పంకేరుహ భవ
త్సుగంధాయాత శ్రీప్రచల దళినీవారణధియా
లసన్నాసాకారేవహాసి సహనాచంపక తులాం
వతత్సౌందర్యార్ద్రం నను కనకదుర్గే! భగవతి!

తా॥ మూడు వేదములచే స్తుతింపబడుదానా, నిత్య స్వరూపిణి! నీయొక్క ముఖపద్మములనుండి బయలు వెడలు సుగంధమునకు వచ్చు తుమ్మెదలను నివా రించుటకొఱకై సంపెంగపువ్వువంటి ముక్కును

ధరించుచున్నావు. సౌందర్యము కొఱకు సంపెంగ
పువ్వువంటి ముక్కును నీవు ధరించుటచేను
ఓ కనకదుర్గే! భగవతి! (తుమ్మెద సంపెంగ పువ్వు
పై వాలదు)

25. శ్లో. వహన్నే శోణాభ్యాం వరకమల రాగాహ్వయమణే
సుధాపూరం సారం సుకుచిర మృదుత్వం యది
వహేత్
తదాలబ్ధుం యోగ్యో భవతి భవదీయాధర తులాం
జగద్రక్షా దీక్షావతి కనకదుర్గే! భగవతి!

తా॥ జగద్రక్షణ దీక్షగల కనకదుర్గ! భగవతి! పద్మరాగ
మణి దయను వహించి సారమగు అమృతముతో
నుండి సుందరమగు మృదుత్వముతో నున్నచో నీ
యధరముతో సామ్యమును పొందుటకు యోగ్య
మగును.

26. శ్లో. లసన్నాసాభూషాగ్రగ పృథుల ముక్తామణి యుతం
నితాంతారుణ్యాంత స్త్వదశనవాసో విజయతే
సుధాసింధోర్మధ్యే నిపతితి సుధాబింబసహిత
ప్రవాళశ్రీచోరం నను కనకదుర్గే! భగవతి!

తా॥ ప్రకాశించు ఆడిబాసయొక్క అగ్రభాగమును పొందిన పెద్దదియగు మణివంటి ముత్యముతో గూర్చిన బోగా నీ నాసాగ్రమందు నీ పెదవి సహోత్పత్తిగా నుండుచున్నది. అమృత సముద్రమధ్యయందున్న అమృత బిందువుతో గూర్చిన పగడముయొక్క శోభను హరించుచున్నది. ఓ భగవతి! కనకదుర్గ!

27. శ్లో. అమోఘా ఇత్యాద్యైర్వదశన సమాఖ్యాయ కవిభి
ర్విముక్తా ముక్తా ఇత్యధికవిదితా మౌక్తికగణాః
నిశామల్యాంగత్యాతి దనుముఖి తాంబూలసహితా
గతాస్తత్సాహిత్యం ఖలు కనకదుర్గే! భగవతి!

తా॥ నీ పలువరుసతో పోల్చుటకు తగవని కవులు ముత్యములను విడిచినందున - ముక్తాయని ముత్యములకు పేరు వచ్చినది. ఆ ముత్తెములం సున్నమై నిత్య తాంబూలములో కలసి నీ పలువరసకు సేవచేసి వాటి సామ్యమును పొందుటకు సేవచేయుచున్నవి.

28. శ్లో. జితోఽహం సాధ్వ్యాత్వామృదుతరవాణీ విలసనైః
కథం దృష్ట్వ్యాస్యాంబా ఘన సమతయా బింబ కథయ
ఇతి క్రోధాచ్ఛాంచా ద్విత వదనేర క్తిమయుతః
శుకోయం జిజ్ఞాసిత్ఖలు కనకదుర్గే! భగవతి!

తా॥ పార్వతియొక్క వెంటటి వాగ్విలాసముచేత నేర్పోకి
తిని. దుర్గయొక్క అధరముతో సమానముగా ఉన్నానని
నీకు గర్వమెందుకని దొండపండుతో చిలుక అన్నది.
దొండపండు అంగీకరించలేదు. అప్పుడు చిలుక
దొండపండును పొడిచినది. అందుకే దానిముక్కు
ఎఱ్ఱబడినది. శుకమునకు నీతత్త్వము తెలియునుగదా!
ఓ కనకదుర్గా! భగవతి!

29. శ్లో. ఫలంబింబస్యేదం భవతి భవదీయాధరతులా
కృతాశం తన్మాత్యం నహితమతిరస్యేతి విదితా,
నచేత్తస్మిన్ భుక్తే సుమతి కవితానామపిన్మృణాం
కథంస్యాత్తన్మాద్యంభువి కనకదుర్గే! భగవతి!

తా॥ నీయధరమును దొండపండుతో పోలిచిన కవిబుద్ధి
మందమయినది. లేకున్న మంచి బుద్ధిమంతులగు
కవుల బుద్ధులుకూడ దొండపండును తినినచో
మాంద్యమును పొందుచున్నవి. ఓ కనకదుర్గ -
భగవతి.

30 శ్లో. అతుల్యంతే కంఠంహర తరుణి దృష్ట్వాసుకవయః
ప్రభాషంతే శంఖం పరిహసన పాత్రం భవతితత్
స్వరూపధ్యాతౄణాం సభవతిని ధిక్శంఖ ఇతిచే
దసందేహస్థానే ఖలు కనకదుర్గే భగవతి.

తా॥ అనవరానమును నీకంఠమును శంఖముతో కవులు పోల్తురు. ఇదిహాస్యాస్పదము - నీకంఠమును ధ్యానించువారికుజేరునిక్షేపమున్న శంఖమనెడి నిధిలాభించును. సందేహము లేదు. కనకదుర్గ! భగవతి!

31 శ్లో. అసుంతం తే కంఠస్థిత కనకసూత్రం విజయతే హాలాయత్వా మర్త్యాదమృత మివపీత్వా పిగరళం సమాఖ్యాం విఖ్యాతాం సమలభత మృత్యుంజయ ఇతి త్రయీవేద్య క్రీడావతి కనకదుర్గే! భగవతి!

తా॥ మూడు వేదములచే తెలియబడిన క్రీడగల ఓ భగవతి! కనకదుర్గ! వహించిన నీకంఠమందున్న మంగళసూత్రము సర్వోత్కృష్టగానున్నది. శివుడు నీమంగళసూత్రముయొక్క శక్తిచేత విషము త్రాగినను మృత్యుంజయుడనెడి ప్రఖ్యాతిని బొందెనో అందువలన నీ మంగళసూత్రము గట్టిది

32. శ్లో. చిరంధ్యాత్వాధ్యాత్వా సకల విబుధాభీష్టనిచయం తతస్త్వల్లావణ్యామృతజలధి సంప్రాప్తజననే భుజాకారేణైకే భువన వినుతే కల్పకలతే శ్రియైమే భూయాస్తాంసను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! సకల విబుధులకు, సకల కామ్యములను తీర్చుటకుపాయమును చిరకాలమాలోచించి, అటుపిమ్మట నీలావణ్యామృతసముద్ర

మంపు కల్పలతలు, నీ భుజాకారములుగా వర్తించి
నవి. అవి లోక ప్రసిద్ధములు. అవి నాకైశ్వర్యము
కొఱకగుగాక.

33. శ్లో. విరాజత్కేయూర ద్వయమణి విభాభానుకిరణై
ర్నితాంతవ్యాకోచీకృతమదనజిన్నేత్ర కమలా
విభోః కంఠాశ్లేషాద్విపుల పులకాంకూర జననా
భుజౌ మే త్రాతారౌ నను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ప్రకాశించు భుజకీర్తుల రెంటి యందున్న మణికాంతులనెడి సూర్యకిరణములచే మిక్కిలి వికసించిన శివుని నేత్రపద్మములు కలవి, శివుని కంఠమును కౌగలించుట వలన శివునికి విపులమగు పులకాంకురములను కలిగించునవి అగు నీ భుజములు, నన్ను రక్షించుగాక.

34. శ్లో. సుపర్వారామాంతః స్ఫురిత సహకార ప్రసూనలతా
సమగ్రశ్రీ జాగ్రత్కిసలయ సగర్వోద్య మహితౌ
కరౌ తే భూయాస్తాం మమ శుభకరౌ కాంచనకరా
కరౌ నిశ్శంకం శాంకరి కనకదుర్గే భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! దేవలోకమందు మామిడి తీగలందలి చిగుళ్ళతో సమమైన నీ చేతులు కాంచన రాశికి నెలవులైనవి నిశ్శంకముగ నాకు శుభకరము లగు గాక.

35. శ్లో॥ ప్రశస్తైస్త్రైలోక్యే బహుళ దనుజత్రాస విచల
న్మరున్మస్తన్యస్తౌ జనని తవహస్తౌ హృదిభజే,
స్మరోయత్సంకాశాం క్షితిసలయాం చైవ ధృతవాన్
త్రిలోకీజేతా సీత్తలు కనకదుర్గే! భగవతి!

తా॥ ముల్లోకములయందు, ప్రశస్తములున్నూ, అధికముగు రాక్షసులయొక్క భయముచే చలించు దేవతలయొక్క శిరస్సులందుంచబడిన జననీ నీహస్తములను, హృదయమందు సేవించుచున్నాను. మన్మధుడు నీచేతులతో సమముగ నున్నందున చిగుళ్లనాయుధములుగ ధరించుచున్నాడో కనకదుర్గ! భగవతి!

36. శ్లో॥ పురారాతేః పాణిగ్రహణసమయే మౌక్తికచయాన్
విధాతుంశచ్ఛిష్టే జనకవచనాదున్నమితయోః
యయోరూపం దృష్ట్వా భవ దుదితలజ్జా సురవదీ
కదాక్షిత్రా తా రామమ కనకదుర్గే! భగవతి!

తా॥ పూర్వమందు శివుడు నీపాణి గ్రహణముచు చేయుచున్నపుడు, అతని శిరస్సునందు ముత్తెములను తలంబ్రాలుగా పోయుటకు నీతండ్రి వాక్యము వలన నీవు చేతులతో ముత్తెముల నెత్తి పట్టుకొనునపుడు

ఆ హస్తముల రూపమును జూచి, గంగానదీ తీరంలో
గూడి యున్నవో. ఆ హస్తములు నాయొక్క
బాధలు నెప్పుడు పోగొట్టునో, కనకదుర్గా! భగవతి!

37. స్ఫురంతో నిశ్శంకం పురహర నిరాతంక విజయ
క్రియాయాత్రోద్యుక్త స్మరబిరుద పాఠాన్వయభ్రంశం
ఝుణత్కారా రావాః కనకవలయానాం తవ శివే
వితన్వంతు శ్రేయో మమ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గా! భగవతి! మంగళస్వరూపిణీ! భయము లేకుండ శివుని జయించుటకు మన్మథుడు విజయ యాత్రకు బయలుదేరు సమయమందు మన్మథుని బిరుదుల తాలూకు ధ్వనులా యన్నట్లులనున్న ప్రకాశించు నీ బంగారు గాజుల ధ్వనులు నాకు శ్రేయస్సును విస్తరింప చేయుగాక.

38. శ్లో॥ కుచౌ తే రూపశ్రీ విజితలికుచౌ మే శుభకరౌ
భవేతాం వ్యాకీర్ణ ప్రకటతర ముక్తామణిరుచౌ,
హరించాద్యా దేవా యదుదిత సుధాపాతు రనిశం
సుబ్రహ్మాస్సేనాన్యోనను కనకదుర్గే! భగవతి!

తా॥ మిక్కిలి స్పష్టమైన ముత్తెములు, మణులయొక్క కాంతులు గల నిమ్మకాయలను జయించిన రూపము గల నీ కుచములు - నాకు శుభమును చేయుగాక.

కుచములు నుండి పుట్టిన యమృతమును త్రాగిన
కుమారస్వామికి బ్రహ్మాది దేవతలుసదా, ఒంగి
యుంటున్నారో! ఓ కనకదుర్గే! భగవతి!

39. శ్లో. అతుల్యంతే మధ్యం వదతి హరిణాధ్యేన సదృశం
జగత్యన్యోయుక్తం జనవిఖిలత ప్రమాపకలనే,
కృతాగః పంచాస్యోభవతి తవవాహః ప్రతిదినం
జగత్సర్గ క్రీడావతి! కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ జనని! అసమానమయిన నీ నడుమును, సింహము
యొక్క నడుముతో జగత్తు పోల్చుచున్నది అది
యుక్తముగాదు. నీ నడుముయొక్క రూపమువంటి
రూపమును సంపాదించుటకు సింహము అశక్తుడయి
ప్రతిరోజ నీకు వాహనముగా నున్నది, జగత్తు
యొక్క సృష్టి క్రీడగల, ఓ కనకదుర్గే! భగవతి!

40. శ్లో. అసౌపున్నాగస్య ప్రసవమృదు శాఖాంచలగతః
తవఃకృత్వాతేక్షేజనని తవనాక్షేః సదృశతాం
ప్రమత్తః పున్నాగ ప్రసవ ఇతరస్తాదకగతే
స్తులామాప్తుం వాంఛత్యపి కనకదుర్గే. భగవతి!

తా॥ ఓ జనని! కనకదుర్గా! భగవతి. ఈసుర పొన్న వృక్షముయొక్క పుష్పము నాపయిన కొమ్మ చివర నుండి తపస్సుచేసి నీ జొక్కతో సమానమయినది. ఏనుగు గున్న నీయొక్క గమన సామ్యమును పొందుటకు కోరుచున్నది,

41. శ్లో. త్రిలోకీ వాసాంచద్యుతి జనతా దుర్గమభవ
న్నితంబ శ్రీ చౌర్యం కలితవదితి సంచిత్య పులినం
సరో బాహ్యంచక్రేజనని భవదీయ స్మరణతో
మురే వార్ధీకేశాజని కనకదుర్గే! భగవతి!

తా॥ మూడు లోకములందలి యువతులకు దుర్లభమయిన నీ పిరుదుల సౌందర్యము నపహరించినదని యిసుక తిన్నెను బుద్ధిమంతురాలగు ప్రవాహము చెఱువు నుండి బాహ్యమునుగా జేసెను. నీ స్మరణ వలన ప్రవాహము తెలివిగలదాయెను.

42. శ్లో. జితోహంపార్వత్యామృదు తరగతీనాం విలసనైః
తదూరోస్సౌందర్యం సహజమధిగంతుంజడతయా,
కృతారంభా రంభా ఇతివిదళితాసాంవనమయం
కరీహామర్షః శ్రీకరి కనకదుర్గే! భగవతి!

తా॥ పార్వతీయొక్క మిక్కిలి మృదువగు నడకల విలాసము చేత నేను జయింపబడితిని. ఆమెయొక్క తొడలయొక్క సహజ సౌందర్యమును పొందుటకు జడత్వముచేత అరటి సంభములు ప్రారంభించినవని ఏనుగు అంహానముచే నరటి స్తంభములను విరిచివేసెను. ఓ భగవతి! ఓ కనకదుర్గా!

43. శ్లో॥ ప్రవిష్టా తేనాభీబిల మహిత రోమావళిరియం
కటీచంచత్కాంచీ గుణవిహిత సౌత్రా మణమణేః
రుచాం రేఖేవాస్తే రుచిరతర మూర్ధ్వా యనగతా
శ్రితశ్రేణీ సంపత్కరి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ఆశ్రయించిన సంపత్తుల నిచ్చుదానా! నీ నాభియొక్క బిలమును నల్లనిరోమపంక్తి ప్రవేశించినదయి నీకటి ప్రదేశమునందున్న బంగారపు వడ్డాణమందలి యింద్రనీల మాణిక్యముయొక్క కాంతులయొక్క రేఖవలె పైకి వ్యాపించినదయి యున్నది.

44. శ్లో॥ అవిర్వాచ్యం జఘూ రుచిరరుచి సౌందర్యవిభవం
కథం ప్రాప్తుం యోగ్యస్తవ కలమగర్భోగిరిసుతే
తదీయం సౌభాగ్యం కణశ జనన్తై కావధి సుధీ
జనైశ్చింతా కార్యావను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! వర్ణింప శక్యముగాని నీ పిక్కల యొక్క కాంతి యొక్క సౌందర్యము పొందుటకు ఎవరికి శక్యమగును? వరివెన్ను యొక్క సౌభాగ్యము గింజలు పండేవరకు, పిక్కల సౌంద ర్యము నిత్యము మండును. పిక్కల సౌందర్యము వరి వెన్నుల కెల్లు వచ్చును. రాదని భావము.

45. శ్లో. సదా మేభూయాత్తే ప్రపదమమితా భీష్టసుఖదం
సురస్త్రీఫాలాగ్రచ్యుత మృగమదానాం సముదయం
అశేషం నిర్ధౌతః ప్రణయ కలహేయత్ర పురజి
జ్జటా గంగానీరైర్జనను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! నీయొక్క పాదాగ్రము ఎల్ల ప్పుడు దేవతా స్త్రీలయొక్క ఫాల ప్రదేశమందలి తిలకమునుండి జారిన కస్తూరియొక్క సముదాయము గలదై ప్రణయ కలహమందు శివుని జటా జూట మందలి నీరుచేత కడుగబడినదో అది నా కమిత ముగా కోరికలను తీర్చునదియై యగుగాక.

46. శ్లో. మనోజ్ఞాకారంతే మధుర నినదం నూపురయుగం
గ్రహీతుం విఖ్యాతాన్ గతి విలసనా నామతిశయాన్
స్థితం మన్యేహం సద్వయ మితినచేద్ధంసకపదం
కథంధతే నామ్నాననను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! హంసలజంటను సుందర మయిన యాకారముగల మధురమయిన ధ్వనిగల అందెల యొక్క యుగమునుగా తలచుచున్నాను. ప్రసిద్ధములగు గతి విలాసలయొక్క అతి వేగము లను నేర్చుకొనుటకు వచ్చిన హంసలేయనినాభావము కానిచో నీ యందెలకు హంసకములను పేరెట్లు వచ్చినది!

47. శ్లో. త్వదీయం పాదాబ్జద్వయమ చలకన్యే విజయతే
సురస్త్రీ కస్తూరీ తిలకనికరాత్యంత సురభి,
భ్రమంతో యత్రా రాఌ్యప్రకరహృదయేందిందిరగణా
స్సదా మాద్యంతి శ్రీమతి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! దేవతా స్త్రీలయొక్క కస్తూరీ తిలకముచే బాగుగ పరిమళించు నీ సంబంధ మగు పాదార విన్దయుగము, ఓ పార్వతీ సర్వోత్కర్షగా నున్నది ఉత్తమమయిన స్త్రీలయొక్క హృదయములనెడి తుమ్మెదలయొక్క సముదాయములు, ఏ నీపాదార విన్దములయందు తిరుగుచు నిత్యము మదించు చున్నవో.

48 శ్లో॥ అపర్ణే తే పాదావ తను తను లావణ్య సరసీ
సముద్భూతే పద్మే ఇతిసుకవిభిర్నిశ్చితమిదం
నచేద్గీర్వాణ స్త్రీసముదయ లలాట భ్రమరకాః
కథంత్వత్తా సక్తావను కనకదుర్గే భగవతి!

తా॥ ఓ అపర్ణా! నీపాదములు నీ శరీర లావణ్య సరస్సు నుండి బయలు దేరిన పద్మములని కవులచే నీ విష యము నిశ్చయింపబడినది. కానిచో దేవతా స్త్రీల సముదాయముయొక్క లలాటముల చెడి తుమ్మెద లెందుకు నీ పాదములయందాసక్తి కలవి యగు చున్నవి? ఓ కనకదుర్గా! భగవతి! సూక్ష్మమయిన శరీరము గలదానా!

శ్లో. 49. రమావాణీంద్రాణీ ముఖయువతి సీమంత పదవీ
నవీనార్కచ్ఛాయా సదృశరుచి యత్కుంకుమరజః
స్వకాంగాకారేణ స్థితమితి భవత్పాదకమల
ద్వయేమన్యేశంభోస్సతి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ శివునిపత్ని! భగవతి! కనకదుర్గ! లక్ష్మి సరస్వతి మొదలగు స్త్రీల యొక్క పాపిడియందలి నూతన మగు సూర్యకాంతిలో సమానమగు కాంతిగల

ఏ కుంకుమపొడి నీ పాదకమల ద్వయమందున్నదె నీ శరీరముయొక్క కాంతి యాకారముచేత నున్న దని తలచుచున్నాను.

50. శ్లో, దవాగ్నిం నీహారం గరళమమృతం వార్ధిమవనీ
స్థలం మృత్యుంమిత్రం రిపుమపిచ సేవాకరజనం
విశంకం కుర్వతో జనని తవ పాదాంబురుహయోః
ప్రణామాస్సంస్తుత్యామమ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! దావాగ్నిని మంచునుగా, గరళమును అమృతమునుగా, సముద్రమును, భూతలమునుగా. మృత్యువును మిత్రునిగా, శత్రువును సేవకునిగా, ఓ జనని! నీ పాదపద్మ నమస్కారములు స్తోత్రముతో గూడినవై, శంక లేకుండగ చేయుచున్నవి.

51. శ్లో. జలప్రాయా విద్యాహృది సకల కామాః కరగతాః
మహాలక్ష్మీర్దాసీమనుజపతి వర్యాస్సహచరాః
భవత్యాశ్శాంతంతే పదకమల యోర్భక్తి సహితాం
నతింకుర్వాణానాం నను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గా! భగవతి! విద్య మంచినీళ్ళప్రాయమగును. అన్ని కోరికలు హృదయమందున్నవి ఫలించి చేతికి లభించును. మహాలక్ష్మి దాసియగును.

మహారాజులు సహచరులగుదురు నీ పదకమలము లందు విశ్రాంతిలేకుండగా భక్తితో నమస్కరించు వారికి ఈ ఫలము లభించును.

52. శ్లో. తవశ్రీమత్పాద ద్వితయగత మంజీర విలస
న్మణిచ్ఛాయాచ్ఛన్నాకృతి భవతి యత్ఫాలఫలకం
సతత్రైవా శేషావని వహన దీక్షా సముచితం
వహేత్పట్టం హైమంనను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గా! భగవతి! నీయొక్క శోభాయుక్త మయిన పాదయుగమందలి అందెలయందు ప్రకాశించు మణికాంతిచే కప్పఁడిన యాకారము గలదై ఎవనిఫాల ప్రదేశముండునో, వాడొక్కడే సమస్త భూమిని పరిపాలించుటకు దీక్ష కొరకై ధరించు బంగారు పట్టాగలవాడగును.

53. శ్లో. తనోతు క్షేమం త్వచ్చరణనఖ చంద్రావళిరియం
భవత్ప్రాణేశస్య ప్రణయ కలహారంభ సమయే
యదీయ జ్యోత్స్నాభిర్భవతినితరాం పూరితతను
శ్శిరోగ్రే బాలేందుర్నను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతీ! అట్టి నీ పాదములయందలి గోళ్ళనెడి చంద్రపంక్తి మాకు క్షేమమును కల్గజేయుగాక, నీ ప్రాణేశుని ప్రణయ కలహారంభ సమయమందు ఏ గోళ్ళ కాంతి చంద్రికలచే శిరస్సుయందలి బాలచంద్రుడు పూర్ణ చంద్రుడాయెనో (దుర్గయొక్క కాళ్ళమీద శివుడు పడెనని భావము)

54. శ్లో. సమస్తాశాధీశ ప్రవరవనితాహస్త కమలై
స్సుమైఃకల్పద్రూణాం నిరతకృతపూజౌ నిరుపమౌ
నతానామిష్టార్థ ప్రకరఘటనా పాటవయుతౌ
నమస్యామః పాదౌతవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ భగవతి! కనకదుర్గా! సమస్త దిక్పాలకుల భార్యల హస్తకమలములచేత ధరించబడిన కల్ప వృక్షముల పూలచే చేయబడిన పూజగలవి అసమానములయినవి. నమస్కరించు వారలకు ఇష్టమైన పురుషార్థములనిచ్చు నీ పాదములను నమస్కరించ గలము.

55. శ్లో. పురాబాల్యే శీతాచలపరిసరక్షోణి చరణే
యయోస్సర్శంలబ్ధ్వా ముదితమనసః కీటనిచయాన్
విలోక్యశ్లాఘుం తేవిబుధసముదాయాః ప్రతిదినం
నమామస్తౌపాదౌనను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గా! భగవతీ! పూర్వమందు బాల్యమందు, హిమాలయ పరిసర ప్రదేశమందు సంచరించినప్పుడు ఏ నీయొక్క పాదముల స్పర్శను పొంది సంతోషించిన మనస్సుగల, పురుగుల సముదాయములను చూచి దేవతలయొక్క సంఘములు ప్రతిదినము పొగుడుచున్నవో ఆ నీ పాదములను నమస్కరించుచున్నాము.

56. శ్లో. నరాణా మజ్ఞానాం ప్రశమయితు మంతఃస్థతిమిరాణ్య లక్ష్మీసంతాపంగమితమనుజాన్ శీతలయితుం సమర్థాన్నిర్దోషాంశ్చరణనఖ చంద్రానభినవాన్ నమామస్సద్భక్త్యా తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గా! భగవతి! అజ్ఞానులగు నరులయొక్క లోపలనున్న చీకట్లను శాంతింప చేయుటకు దారిద్ర్య సంతాపముగల మనుష్యుల తాపమును చల్లార్చుటకు సమర్థతగలిగి దోషములేని నూతనములగు నీ పాదములందలి గోళ్ళనెడి చంద్రులను, సద్భక్తిచే నమస్కరింపుచున్నాము.

57. శ్లో. ముకుందబ్రహ్మేంద్ర ప్రముఖ బహుబర్హిర్ముఖశిఖా విభూషా విభ్రాజన్మ ఘనమణి సందర్భరుచిభిః విశంకంస కంత్వచ్చరణ నఖచంద్రేషు ఘటితం కవీంద్రైస్సోత్రవ్యం తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గా! భగవతీ! విష్ణువు, బ్రహ్మ. దేవేంద్రుడు మొదలగు బహువిధములగు దేవతలయొక్క జుట్టు యందు గలభూషణములయందు ప్రకాశించు ఇంద్ర నీలమణుల కాంతులతోటి నీ పాదములందలి గోళ్ళ • నెడి చంద్రుల విషయమగు సంఘటన సంశయము లేకుండగ కవీంద్రులచే స్తుతింప దగినది.

58. శ్లో. నఖానాంధావళ్యం నిజమరుణి మానంచ సహజం
నమద్గీర్వాణస్త్రీ తిలకమృగనాభి శ్రియమపి
వహంతౌ సత్వాది త్రిగుణరుచి సారానివసదా
నమస్యామః పాదౌ తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! గోళ్ళయొక్క తెలుపును సహజమగు యెఱుపును నమస్కరించు దేవతా స్త్రీలయొక్క తిలకమగు కస్తూరియొక్క శోభను సత్వాది త్రిగుణసారములను వలె వహించుచున్న నీ పాదముల నెల్లప్పుడు నమస్కరించు చున్నాము. అనగా సత్వగుణము తెలుపు, రజోగుణము ఎఱుపు తమోగుణము నలుపు, ఈ గుణముల సంపుటి యగు మాయపాదములందు పడినట్లుగా నున్నది.

59. శ్లో. మణి శ్రేణీ భాస్వత్క నక మయమంజీర యుగళీ
ఝణత్కారా రావచ్ఛల మధుర వాచాంవిలసనైః
అభీష్టార్థాన్ దాతుంవినత జనతాహ్వాన చతురా
వివఖ్యాతౌ పాదౌ తవ కనకదుర్గే! భగవతి

తా॥ ఓ కనకదుర్గా! భగవతి! మాణిక్య పంక్తులచే ప్రకాశించు బంగారు వికారమగు అందెల ద్వంద్వము యొక్క ఝణ ఝణ ధ్వనులనెడి మిషచేత నైన మధుర వాక్కులయొక్క విలాసలచేత ఇష్టమగు వరముల నిచ్చుటకు నమస్కరించు జనులను పిలుచుట యందు చాతుర్యము గలవివలె యున్నవై నీ పాదములు, ప్రఖ్యాతి చెందినవి.

60. శ్లో. నమద్గీర్వాణస్త్రీ తిలక మృగనాభీ ద్రవయుతం
నఖచ్ఛాయా యుక్తం జనని తవపాదాంబు జయతి
సమాచత్కాళిందీ ఝరసలిలసంమ్మిశ్రితవియ
న్నదివారీ వశీకరి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! నమస్కరించు దేవతా స్త్రీల బొట్టుగానున్న కస్తూరీ ద్రవముతో కూడినదై నీ గోళ్ళయొక్క కాంతితో గూడిన పాదజలము యమునా జలముతో గూడిన గంగాజలమువలె, ఓ జననీ ఐశ్వర్యము నిచ్చుదాన కనపడుచున్నది.

61\. శ్లో. సుర(శ్రే)ణీపాణి ద్వితయగత మాణిక్యకలశై
ర్ధృతం హేమాంభోజ ప్రకర మకరందేనమిళితం
సతాం బృందైర్వంద్యాం చరణయుగ సంక్షాళనజలం
పునాత్వస్మాన్నిత్యం తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! దేవతా పంక్తులహస్త యుగ ములందలి మాణిక్య కలశలచే ధరింపబడి బంగారు పద్మములందలి మకరందముతో కలసి, సజ్జనులచే నమస్కరింపబడిన నీ పాదములను కడిగిన జలము మమ్ములను నిత్యము పవిత్రము చేయుగాక.

62\. శ్లో. పరావన్మం జీరద్వయ నిహిత హీరోప రుచి
ప్రసారైర్భిన్నైర్భిదం ప్రథిత పరమ బ్రహ్మ ఋషిభిః
శిరోభాగై ర్ధార్యం పదకమలనిర్ణే జనజం
వసన్మే శీర్షాగ్రే తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ధ్వనిచేయుచున్న అందెల రెంటియందుంచబడిన వజ్రముల కాంతి ప్రసారము లతో కలసిన నీ కాళ్ళు కడిగిన జలము గొప్ప బ్రహ్మర్షులచే శిరోభాగములందు ధరింపబడినది -నా శిరస్సు మీద నుండుగాక.

63. శ్లో. సమీపే మాణిక్యక్షితపదపీఠస్య నమతాం
శిరస్సు త్వత్పాదక్షాళన సలిలం యన్నిపతతి,
తదేవోచ్చస్థానస్థితి రభిషేకాంబు భవతి
ప్రభావోయం వర్ణ్యస్తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! మాణిక్యములచే మాటబడిన పాదపీఠముయొక్క సమీపమందు నమస్కరించు వారియొక్క శిరస్సులయందు యే నీపాదములు కడిగిన నీరుపడుచున్నదో - అది ఉచ్చస్థాన స్థితిని కలుగ చేసెడియభిషేక జలమగుచున్నది. ఈ నీ ప్రభావము వర్ణింప తగినది.

64. శ్లో. నృణాందీనానాంత్వచ్చరణకమలైకా శ్రయవతాం
మహాలక్ష్మీప్రాప్తిర్భవతి నహిచిత్రాస్పదమిదం
సమాశ్రిత్యాంభోజం జడమపిచరేఖాకృతిధరం
శ్రియోనిత్యం ధామాజని కనకదుర్గే! భగవతి!

తా॥ నీ పాదపద్మములను మాత్రమే యాశ్రయించిన దీనులగు, మానవులకు మహాలక్ష్మీ ప్రాప్తి కలుగుట, చిత్రముగాదు. జడమయినను పద్మరేఖ నాశ్రయించినచో లక్ష్మికి నివాసస్థానమగుచున్నది. ఓ కనక దుర్గ! భగవతి!

65 శ్లో. ఖగేంద్రంసాహంసాస్తవగతి విలాసేన విజితా
స్స్వలజ్జాస్తత్తుల్యాం గమనమధిగంతుం సకుతుకాః
భజంతే బ్రహ్మాణం రథవహన ఏవైకనిరతా
మనోజాతారాతేస్సతి కనకదుర్గే! భగవతి!

తా॥ శివునిసతి! కనకదుర్గ! భగవతి! పక్షులలో శ్రేష్ఠ ముఃగు హంసలు నీయొక్క గతి విలాసలచే జయింపబడి సిగ్గుతో కూడినవై నీ నడకతో సమానమగు నడకను సంపాదించుటకు వాహనముగా నుండి బ్రహ్మను సేవించుచున్నవి.

66. శ్లో. జగన్మాతర్భవ్యాంగుళి వివర మార్గేషు గళితం
చతుర్ధాతే పాదాంబుజ నలినమేల ద్విజయతే
ప్రదాతుం ధర్మార్థప్రముఖ పురుషార్థ ద్వయయుగం
చతుర్మార్గ్యావిద్ధా విధ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ జగన్మాత! కనకదుర్గ! భగవతి! మంగళప్రదమగు వేళ్ళయొక్క మార్గములందు జారిన నీపాదోదకము నాల్గుధారలుగా జారి సర్వోత్కర్షగా నుంటున్నది. ధర్మార్థ కామమోక్షములనెడి నాల్గు ధారలుగా నున్నదా యన్నటుల నున్నది.

67 శ్లో. అజోయం శ్రీశోయం సుకపరివృఢోయం రవిరయం
శశాంకోయం కోయం సకలజలధీనాంప తిరయం
ఇతి త్వాం సంప్రేక్షుం సముపగత దేవాః పరిచరై
ర్జనైర్విజ్ఞాప్యంతేఖలు కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ భగవతి! కనకదుర్గ! వీడు బ్రహ్మ, వీడు విష్ణువు,
వీడింద్రుడు, వీడు సూర్యుడు, వీడు చంద్రుడు,
వీడు సకలసముద్రములకు అధిపతియగు వరుణుడు.
ఈ విధముగా నిన్ను చూచుటకు వచ్చిన దేవతలు
నీ పరిజనముచే విజ్ఞాపన చేయుబడుచున్నారు.

68 శ్లో. మహాపీఠా సీనాంమఘవముఖ బర్హిర్ముఖసఖీ
నికాయైస్స సేవ్యాంకరతల చలచ్చామరయుతైః
ప్రదోషేఐశ్వర్యాతీం పశుపతి మహాతాండవ కళాం
భజేత్వాం శ్రీకాంతాసఖి, కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! లక్ష్మీదేవి సఖురాలుగా
కలదానా! మహాపీఠమందు కూర్చున్నటు వంటి
హస్తములందు చలించు వింజా మరలతో గూడిన
ఇంద్రాదిదేవతల భార్యలచే సేవింప బడుచున్నటు
వంటినీన్ని, శివుని తాండవకళను ప్రదోషకాలమందు
చూచుచున్న నిన్ను నేను సేవించు చున్నాను.

69 శ్లో॥ పరంజ్యోతిస్సద్బ్రహ్మజ్ఞాస్సుర తరులతాం దుర్గతజనా
మహాజ్వాలా మగ్నేర్భువనభయదా రాక్షసగణాః
లలాటాక్షస్యాహ్లాద తనుజయలక్ష్మీమపి తం
హృదిధ్యాయంతి త్వామను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! బ్రహ్మవేత్తలు పరంజ్యోతి నిగానున్న, దరిద్రుల సకల కామ్యములను తీర్చు కల్పలతగానున్న, భువనములకు భయమును కలిగించు రాక్షస గణములు అగ్ని జ్వాలలుగానున్న, శివుడు ఎల్లపుడు సాక్షాత్తు గొప్ప జయలక్ష్మిగా నున్న నిన్ను హృదయమందు ధ్యానింతురు.

70. శ్లో. సముద్యద్బాలార్కాయుతశత సమానద్యుతి మతీం
శరద్రాకా చంద్రప్రతిమదరహాసాంచితముఖం
సఖీంకామారా తేశ్చకిత హరిణీశాబ నయనాం
సదాహం సేవే త్వాంహృది కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ఉదయించుచున్న పదివేల లేతనైన సూర్యులతో సమానమయినకాంతిగలిగినటు వంటిన్ని శరత్కాలమందలి పున్నమ చంద్రునితో సమానమయిన చిరునగవుతోగూడి ప్రకాశించు

ముఖము గలిగినయువంటిన్ని మన్మథునికి శత్రువగు
శివునికి సఖురాలయిన చంచలమయిన ఆడిపిల్ల
యొక్క నేత్రములవంటి నేత్రములుగల నిన్ను
హృదయములో నెల్లప్పుడు నేను సేవించు
చున్నాను.

71. శ్లో. తపః కృత్వా లేభే త్రిపుర మథనస్త్వాం ప్రియసఖీం
తపస్యంతీ ప్రాప్తా త్వమపి గిరిశం ప్రాణదయితం
తదేవం దాంపత్యం జయతి యువయోర్భీతదరయోః
కవిస్తుత్యం నిత్యంవను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! త్రిపురాసురులను సంహ
రించిన శివుడు తపస్సుచేసి ప్రియసఖురాలవగు నిన్ను
సంపాదించెను. నీవున్నూ తపస్సు చేసిన దానవై
కైలాసవాసియగు శివుని ప్రాణేశ్వరునిగా సంపా
దించినావు. భయపడిన భయముగల మీ దాంప
త్యము కవులచే స్తుతి పబడినదై సర్వోత్కర్షగ
నుంటున్నది.

72. శ్లో. విభోర్జానాసిత్వం విపులమహిమానం పశుపతే
స్సవజ్ఞాతాతే చరిత జలరాశే రనవధేః
సహిజ్ఞాతుందక్షోభవతి భవతోన్యత్వా మితర
స్త్రిలోకీ సంధానేప్యపి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ప్రభువగు శివుని యొక్క విపులమగు మహిమను, నీవెరుగుదువు. హద్దులేని నీ చరిత్ర యనెడి సముద్రమును ఆ శివుడే యెరుగును. మీ యిద్దఱియొక్క తత్వమును మూడులోకముల యందు తెలుసుకొనుటకును సమర్థుడింకొకడు లేడు.

73. శ్లో॥ నవిష్ణుర్న బ్రహ్మానచ సురపతిర్నాపి సవితా
న చంద్రోనో వాయుర్విలసతిహి కల్పాంత సమయే
తదానాట్యం కుర్వంస్త్వ రమణ ఏకో విజయతే
త్వయాసాకం లోకేశ్వరి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ప్రళయకాలమందు విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, వాయువు ప్రకాశించుటలేదు. అప్పుడు నాట్యమును చేయుచు నీభర్తయొక్కడె నీతోగూడ సర్వోత్కర్షగ నుంటున్నాడు.

74. శ్లో॥ ధనుశ్చక్రే మేరుంగుణ మురగరాజం శితశరం
రమాధీశంచాపి త్రిపురమహనేన త్రినయనః
తదేతత్సామర్థ్యం సహజనిజశక్తేస్తవశివే
జగద్రక్షా దీక్షావతి! కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! మేరు పర్వతము ధనుస్సుగానున్న, ఆదిశేషుని, నారి త్రాడుగానున్న, విష్ణువుని వాడియగు బాణముగానున్న మూడు కళ్ళుగల త్రిపురాసుర సంహారకుడగు శివుడు చేను కొనెను. ఈ శక్తియంతయు సహజమగు నీయొక్క శక్తియే యగుచున్నది. ఓ జగద్రక్షణ దీక్షగల దానా.

75. శ్లో. త్రికోణాంతర్బిందూ పరివిలసనాత్యం తరసికాం
త్రిభిర్వేదైః స్తుత్యాం త్రిగుణ మయమూర్తిత్రయ యుతాం
త్రిలోకై రారాధ్యాం త్రినయనమనః ప్రేమ జననీం
త్రికాలం సేవేత్వాం హృది కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! త్రికోణము లోపల బిందువు మీద ప్రకాశించుట యందత్యంత రసికురాలున్నా, మూడు వేదములచేత స్తుతింపబడు త్రిగుణ స్వరూపమగుమూర్తి త్రయముతోగూడిన త్రిలోకములచేత

ఆరాధింపబడు, మూడు కళ్ళు కలిగిన శివుని మన
స్సునకు ప్రేమను పుట్టించునిన్ను హృదయ మందెల్ల
ప్పుడు సేవించుచున్నాను.

76. శ్లో. మనోధ్యాతుంనాలం జనని తవమూర్తిం నిరుమాం
వచోవక్తుంశక్యంన భవతిహి తేచిత్ర చరితం
తనుస్స్వాత్సే వాయాంభవతివివశాదీన సమయే
కథంవాహంరక్ష్యస్తవ కనకదుర్గే! భగవతి

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ఓ తల్లీ అసమానమగు నీ
మూర్తిని నామనస్సు ధ్యానించుట సమర్థమైనది
గాదు. నీ చిత్రమగు చరిత్రను చెప్పుటకు వాక్కు
శక్తి గలదిగాదు. ఓ పూజ్యురాలా! ఈ దీనకాల
మందు నీ సేవయందు శరీరము స్వాధీనమగుట
లేదు. నేను నీకెట్లు రక్షింప తగిన వాడనగుదునో
గదా

77. శ్లో. వియోగం తేనూనంక్షణమ సహమానః పశుపతి
ర్దదౌ తేహార్ధం తరుణ సుమబాణాయుతసమం
అనే జ్ఞాతవ్యస్తవజనని సౌందర్య మహిమా
త్రిలోకీస్తోతవ్యఃఖలు కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! శివుడు క్షణకాలము. నిశ్చయముగా నీ వియోగమును సహించలేని వాడై యునకుఁగు పదివేలమంది మన్మధులతో సమానమగు దేహములో సగము భాగమును నీకిచ్చెను. ఓయమ్మా దీనినిబట్టి నీ సౌందర్య మహిమ మాకు లోకములందు స్తుతింప దగినదని తెలుసుకొన దగినది.

78. శ్లో. కృతాయోగాయేన శ్రుతిషు విదితాః పూర్వజననే
ధనందత్తం యేన ద్విజకులవరేభ్యో బహువిధం
తపస్తప్తం యేనాస్ఖలిత మతినాతస్య ఘటతే
భవద్భక్తిశ్శంభోస్సతి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ఎవడు శృతులందు ప్రసిద్ధములగు కర్మయోగమును, భక్తియోగమును, జ్ఞానయోగమును, పూర్వజన్మ మందాచరణయందు పెట్టెనో, ఎవడు బహువిధముగ బ్రాహ్మణ శ్రేష్టులకొఱకు ధనమునిచ్చెనో, ఎవడు తొట్రుపాటులేని బుద్ధితో తపస్సును చేసెనో, ఓ శంభుని సతి, వానికి నీభక్తి కుదురును.

79. శ్లో. భవన్మూర్తి ధ్యాన ప్రవణమమలంచాపి హృదయం
భవన్నామ శ్రేణీపఠన నిపుణాంచాపిరసనాం
భవత్సేవాదార్ఢ్యప్రథిత మపికాయం వితర మే
భవానంద శ్రేయస్కరి కనకదుర్గే! భగవతి!

తా॥ శివునికి ఆనన్దశ్రేయస్సును కలుగజేయుదానా, ఓ కనకదుర్గ! భగవతి! నీమూర్తి ధ్యానమందు శక్తిగల హృదయమును నాకిమ్ము నీ నామావళిని పఠించు నైపుణ్యముగల నాలికను నాకిమ్ము. నీ సేవచేయుటకు ప్రసిద్ధమగు దృఢమయిన శరీరము నిమ్ము.

80. శ్లో. ప్రభామంతేవేదాశ్చకిత చకితం తావకగుణాన్
నపారస్యద్రష్టా తవమహిమ వార్థేర్విధిరపి
భవత్తత్త్వంజ్ఞాతుం ప్రకృతిచపలానామపినృణాం
కథంవాశక్తిస్స్యాన్నను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! వేదములు నీ గుణములను అతిభయముతో చెప్పుచున్నవి. బ్రహ్మకూడ నీ మహిమ సముద్రమునకు అంతమును చూచుట లేదు. నీ తత్త్వమును తెలుసుకొనుటకు స్వభావముచేచంచలురగు మానవులకు ఎటుల శక్తిగలదు.

81. శ్లో. నృపావిశచ్ఛత్రం సకల ధరణీ పాలనపరా
స్సుధామాధుర్యశ్రీలలితకవితాకల్పనచణాః
నిరాతంకం శాస్త్రాధ్యయన మనసాంనిత్యకవితా
త్వదీయాజ్ఞేయా శ్రీమతి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! రాజులు ఏకచ్ఛత్రముగ భూమిని పరిపాలించుటకు సమర్థులున్న అమృత మాధుర్యశోభచేత సుందరమగు కవిత్వముయొక్క కల్పనయందు సమర్థులగు కవులున్నగలరో నిర్భయముగ శాస్త్రాధ్యయన మనస్సుగలవారి నిత్యకవిత్వమున్న గలదో - ఈ సర్వము - నీమహిమయే.

82. శ్లో. కదంబానాం నాగాధికచతుర సంచారిభసరీ
కదంబానాంమధ్యేఖచరతరుణీ కోటికలితే,
స్థితాంవీణాహస్తాం త్రిపురమధనానంద జననీం
సదాహంసేవేత్వాంహృది కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! కల్పవృక్షముల వనము లోపల, ఏనుగులకంటె అధిక చాతుర్యముగ సంచరించు సమూహములయొక్క మధ్యలో అనేకకోట్ల దేవతాస్త్రీలతో ప్రకాశించుదానా! వీణహస్తమందు కలిగి యున్నటువంటిన్ని, త్రిపురాసురలను మథిం

చిన శివుని కానందము కలిగించు నిన్నెప్పుడున్ను
నేను హృదయములో సేవించు చున్నాను.

83. శ్లో. గిరాందేవీభూత్వా విహరసి చతుర్వక్త్రవదనే
మహాలక్ష్మీరూపా మధు మథనవక్షస్స్థలగతా
శివాకారేణత్వంశివ తనునివాసం కృతవతీ
కథంజ్ఞేయా మాయాతవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! బ్రహ్మదేవునియొక్క ముఖ
మందు సరస్వతీదేవివై విహరించు చుంటివి విష్ణు
మూర్తి వక్షస్థలమందు మహాలక్ష్మి రూపముతోను
విహరించు చుంటివి. శివుని శరీరమందు, పార్వతీ
దేవి యాకారముతో నున్నావు. నీమాయ ఎట్లు
తెలుసుకోతగినది

84 శ్లో మహారాజ్య ప్రాప్తావతిశయితకౌతూహలవతాం
సుధామాధుర్యోద్యత్సరస కవితాకౌతుకయుజాం
కృతా కానాంశక్యత్సుఖ జనక గీర్వాణభజనే
త్వమే వైకాసేవ్యా నను కనకదుర్గే! భగవతి

తా॥ మహారాజ్య ప్రాప్తియందెక్కువగా కౌతూహలము గలవారును, అమృత మాధుర్యముతో నొప్పు కవిత్వభాగమునందాసక్తి గలవారును, ఎల్లప్పుడు సుఖము కలిగించుటకై దేవతలను సేవించుటయందా సక్తి కలిగినవారికి నీ వాకృతివే సేవింపతగిన దానవు. ఓ కనకదుర్గ! భగవతి!

85. శ్లో. ఫణీముక్తాహారా భవతి భసితాచందనరజో
గిరీంద్రః ప్రాసాదో గరళమమృతం చర్మసుపటః
శివేశం భోర్వ్యాద్యద్వికృత చరితం తత్తదఖిలం
శుభంజాతంయోగాత్తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! పాము ముత్యాలహారమగు చున్నది. భస్మమే మంచిగంధపుదూళి. కైలాసమే మేడ, గరళమే యమృతము చర్మమే మంచి వస్త్రము. ఓ పార్వతి, శివునియొక్క వికృతచరిత్రము సమస్తము నీ సంబంధము వలన శుభమయినది.

86. శ్లో. దరిద్రే వాక్షుద్రే గిరివరసుతే యత్రమనుజే
సుధాపూరాధారస్తవ శుభకటాక్షోనిపతతి
బహిర్ద్వారప్రాంతద్విరదమదగం ధస్సభవతి
ప్రియేకామారాతేర్నను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! దరిద్రుని యందుగాని, నీచుని యందుగాని హిమవంతుని కూతురా! ఏ మనుష్యుని యందు నీ శుభకటాక్షము పడునో వారి ద్వారా బహిర్భాగ ప్రాంతమందు ఏనుగుల మద గంధము పడుచున్నది. మన్మథుని శత్రువగు శివుని ప్రియురాల!

87. శ్లో. ప్రభావం తే వేదాః ప్రకటయతి పౌరాణి కవచః
ప్రశస్తం కుర్వంతి ప్రథితబహుశాస్త్రాణ్య విరతం
స్తువంతః ప్రత్యగ్రం సుకవి నిచయాః కావ్యరచనై
రనంతాం తే కీర్తిం నను కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! నీయొక్క అనంతమయిన కీర్తిని వేదములు చెప్పుచున్నవి. పౌరాణిక వాక్యము ప్రకటించుచున్నది ప్రసిద్ధములయిన బహుశాస్త్రములు ఎల్లప్పుడు ప్రశస్తమయిన దానినిగా చేయుచున్నవి. సుకవిసముదాయములు నూతనముగా కావ్యరచనముల చే స్తోత్రమును చేయుచున్నారు.

88. శ్లో. అసూయేర్ష్యాదంభాద్యవగుణ పరిత్యాగ చతురా
స్సదాచారాసక్తాస్సదయ హృదయాస్సత్యవచనాః
జితస్వాంతాశ్శాంతా విమలచరితా దానవిరతాః
కృపాపాత్రీభూతా స్తవ కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! అసూయ, ఈర్ష్య, దంభము మొదలగు నవగుణములను విడుచుట యందు చాతుర్యముగల వారును సదాచారమందాసక్తి గలవారును, దయతోగూడిన హృదయము గల వారును, సత్యవాక్యము గలవారు మనోజయము గలవారు, శాంతులు. విమలచరిత్రము గలవారు, దాననిరతులు, నీకు కృపాపాత్రులు తల్లి.

89. శ్లో. యదీయాంభస్స్నానాద్దురిత చరితానాం సముదయా
మహాపుణ్యాయంతే మహిమవతి తస్యాశ్శుభకరే
తటేకృష్ణాసద్యా విహితమహితా నందవసతే
కృపాకర్తవ్యా తేమయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ఏ నదిలో స్నానమును చేసినందున పాపచరిత్రముల సముదాయములు, మహాపుణ్యములగునో, ఆ కృష్ణానదియొక్క శుభకరమయిన మహిమగల ఒడ్డుయందు, ఏర్పాటు చేసుకున్న ఆనంద నివాసముగలదానా! నాయందు దయచూపదగినది.

90. శ్లో. యథాపుష్పశ్రేణీ విలసిత కదంబ ద్రుమవనే
తనోర్భాగేనాగేశ్వరవలయినః శ్రీమతియథా
తథాభక్తౌఘానాం హృదికృత విహారే గిరిసుతే
దయాకర్తవ్యాతేమయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! శ్రీమగి; పూలపంక్తితో ప్రకాశించు, కదంబవృక్ష వనమందు ఆదిశేషుని కంకణముగా కలిగిన శివునియొక్క యర్ధశరీరమయిన దానా! భక్తులయొక్క హృదయమందు విహరించు దానా నీదయ నాయందు చేయదగిండి

91. శ్లో. సమారుహ్యాభంగం మృగపతి తురంగంజవయుతం
గళాగ్రేధూమ్రాక్ష ప్రముఖబల బర్హిర్ముఖరిపూన్
నిహత్యప్రత్యక్షం జగదవనలీలాం కృతవతీ
ప్రసన్నాభూయాస్త్వంమయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! తొట్రుపాటు పడనటువంటి వేగముతో కూడుకొన్నటువంటి సింహవాహనమును, అధిష్ఠించి, కంఠముయొక్క అగ్రభాగమందు ధూమ్రాక్షుడు మొదలగు బలవంతులయిన రాక్షసులను; చంపి ప్రత్యక్షముగా, జగద్రక్షణ లీలను చేసితివి. ప్రసన్నురాలవుకమ్మా!

92. శ్లో॥ పరాభూయ త్ర్యక్షం సవనకరణే యత్ర సహితం
దురాత్మానం దక్షం పితరమపి సంత్యజ్య తరసా
గృహే నీహారాద్రేర్జని జననమంగీకృతవతీ
ప్రసన్నా భూయాస్త్వం మయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! యజ్ఞమును చేయునపుడు శివుని పరాభవించి, అనగ శివుని పిలువకుండగ యజ్ఞమును చేయు దురాత్ముడగు దక్షుని తండ్రి నయినను, విడచి, హిమవంతుని గృహమునందు, నీ జననము నంగీకరించితివో ఆ నీవు ప్రసన్నురాల వగుము

93. శ్లో॥ తపఃకృత్వా యస్మిన్ సురపతిసుతోనన్యసులభం
భవాదస్త్రం భేజే ప్రబల రిపుసంహార కరణం
కిరాతే తస్మిన్ ప్రీత్యా సహ విహరణే కౌతుకవతీ
ప్రసన్నా భూయాస్త్వం మయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! అర్జునుడు ఇతరులకు శక్యముగాని తపస్సును చేసి శివుని వలన ప్రబలమగు శత్రువులను సంహరించు అస్త్రమును పొందెనో, ఆ కిరాత వేషమును ధరించిన శివునియందు ప్రీతితో విహరించుటయందు వేడుక కలదానవో ఆ నీవు నాయందు ప్రసన్నురాలవగుము.

94 శ్లో. శరచ్చంద్రాలోక ప్రతిమరుచి మందస్మితయుతే
సురస్త్రీసంగీత శ్రవణకుతుకాలం కృతమతే
కృపాపాత్రీ భూతప్రణమద మరాభ్యర్చితపదే
ప్రసన్నాభూయాస్త్వంమయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! శరత్కాలచంద్రుని వెన్నెలతో సమానమగు కాంతి గలిగిన చిరు నగవుతో గూడిన దానా, దేవతాస్త్రీలయొక్క సంగీతమును వినుటయందు వేగముతో గూడిన బుద్ధికలదానా, దయాపాత్రులగు దేవతలచే పూజింపబడు పాదము గలదానా, నీవు నాయందు ప్రసన్నురాలవగుమా.

95. శ్లో. కపాలస్రగ్ధారీ కరివగజ చర్మాంబరధరః
స్మరద్వేషీ శంభుర్బహుభువన భిక్షాటనపరః
అవిజ్ఞాతోత్పత్తిర్జనని తవపాణిగ్రహణతో
జగత్సేవ్యోజాతఃఖలు కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! మనిషి పుర్రెల దండను ధరించువాడు, కరివగజచర్మమును వస్త్రముగా ధరించువాడు, మన్మధుని ద్వేషించినవాడు, శంభువు అనేకలోకములందు భిక్షాటన మందాసక్తి కలవాడు పుట్టుక తెలియనివాడు, అమ్మా నీపాణి గ్రహణము వలన జగత్తునందు సేవింపతగిన వాడాయెను.

96. శ్లో. పదాభ్యాం ప్రత్యూషస్ఫుటకచశోణాబ్జవిలస
త్ప్రభాభ్యాం భక్తానామ భయవరదాభ్యాంతవశివే।
చరద్భ్యాం నీ హారాచలపద శిలాభంగసరణౌ
నమఃకుర్మఃకామేశ్వరి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! ఓ కామేశ్వరీ! ఓ భగవతి! ఉషఃకాల మందు స్ఫుటముగా వికసించిన ఎఱ్ఱనయిన తామర పువ్వులకాంతివంటి కాంతిగలిగినటువంటిన్ని భక్తుల కభయమును, వరమునిచ్చు నటువంటిన్ని హిమాలయ పర్వతమందలి మెట్లయందు సంచరించు నీ పాదముల కొఱకు ఓ మంగళస్వరూపిణి। నమస్కారము.

97. శ్లో. మదీయేహృత్పద్మేనివసతు పదాంభోజయుగళం
జగద్వంద్యం రేఖాధ్వజకులిశవజ్రాంకితమిదం
స్ఫురత్కాంతిజ్యోత్స్నావితతమణి మంజీర మహితం
దయాధేయామేయామయి కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! జగత్తుచే నమస్కరింప తగిన రేఖాత్మకములగు, జెండా, వజ్రము, కులిశము, మొదలగు చిహ్నములతో గూడిన ప్రకాశించు

కాంతియనెడి వెన్నెలచే విస్ఫురితమయిన మాణిక్యపు టందెలతో గొప్పదియగు నీ పాదారవిన్దయుగళము నా హృదయపద్మమందు నివసించుగాక. నా యందధికమయిన దయియుంచ దగినది.

98. శ్లో. సదాహంసే వేత్వత్పదకమల పీఠీపరిసరే
స్తువన్ భక్తిశ్రద్ధాపరిచయ పవిత్రీ కృతధియా
భవంతీం కళ్యాణీం ప్రచురతర కళ్యాణ చరితాం
దయాధేయామేయామయి కనకదుర్గే! భగవతి!

తా। ఓ కనకదుర్గ! భగవతి! ఎల్లప్పుడు నేను నీ పాదపద్మపీఠప్రాంతమందు భక్తి శ్రద్ధాపరిచయముచే పవిత్రముగా చేయబడిన బుద్ధిచే స్తోత్రమును చేయుచు అధికమగు కళ్యాణ చరిత్రముగల మంగళ స్వరూపిణియగు నిన్ను సేవించు చున్నాను. అధికమయిన దయ నాయందుంచ తగినది.

99. శ్లో. హారశ్యాలీ చైకః పిత్రుభువననివాసీ పశుపతి
ర్దిశావాసోహాలాహల కబళన వ్యగ్రధృతిమాన్
గిరీశోభూదేవం విధగుణ చరిత్రోపిహిభవత్
సుసాంగత్యాత్ శ్లాఘ్యోననుకనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! హర్షుడు శూలము గలవాడు ఏకాకి శ్మశానవాసి, పశుపతి దిగంబరుడు, కాలకూటమనెడు విషమును తినుటయందు వ్యాఘ్రుడయి ధైర్యము గలవాడు, కైలాసవాసి, ఇటువంటి గుణములు చరిత్రగలవాడయినను, నీ సాంగత్యము వలన కొనియాడ తగిన వాడాయెను.

100. శ్లో. సమస్తాశాధీశ ప్రముఖ సురవర్యైః ప్రణమితా
మహార్కాగ్నిధ్వజ్వాలావతి హరిణ పాణి త్రినయనాం
సదాధ్యాయేహం త్వాం సకలవిబుధా భీష్టకలనే
రతాంతాం కల్యాణీం హృది కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! సమస్తములైన దిక్కులకధిపతులు మొదలగు దేవతా శ్రేష్ఠులచేత నమస్కరింపబడుదానవు సూర్యుడు, అగ్ని, చంద్రుడు, ముగ్గురు నేత్రములుగా గలదానవు సకల దేవతలయొక్క కోరికలను చెల్లించుట యందాసక్తి గలిగిన మంగళ స్వరూపిణివగు నిన్ను హృదయమందెల్లపుడు ధ్యానించు చున్నాను.

101. శ్లో॥ సుసంతోషం తోయోవాజపతినియమాదాహితశత
జ్వాలద్వాః త్రైశ్యాన్వ్యాంనిశికనకదుర్గా! స్తుతిమిమాం
మహాలక్ష్మీపాత్రం భవతి సదనం తస్యవదనం
గిరాందేవీ పాత్రంకులమపి విధేః కల్ప శతకమ్

తా॥ మంచి సంతోషము గలిగి ఎవడు నియమముగా ఊహింపబడిన నూరువృత్తములచేత వినదగిన ఈ కనకదుర్గాస్తుతిని జపించునో వానియొక్క గృహము మహాలక్ష్మి పాత్రము వానిముఖము సరస్వతీ నివాసము కులము గూడ బ్రహ్మ యొక్క నూరు కల్పముల వఱకు నుండునదిగాను అగుచున్నది.

102. శ్లో. స్తుతిందుర్గాదేవ్యాస్సతత మఘసంహార కరణే
సుశక్తాంవాలోకే పఠతి సుధియాబుద్ధికుశలః
శ్రియందేవీతస్మైవితరతిసుతానాంచ జగతాం
పతిత్వంవాగ్మిత్వంబహు కనకదుర్గే! భగవతి!

తా॥ ఓ కనకదుర్గ! భగవతి! ఎల్లప్పుడు పాపమును సంహరించుటయందు మంచిశక్తిగల దుర్గాదేవి యొక్క స్తోత్రమును, లోకమందు మంచిబుద్ధిచేత బుద్ధికుశలుడు, పఠించుచున్నాడో దేవి వానికొఱకు లక్ష్మిని, సుతులనుజగత్పతిత్వమును, వక్తృతిత్వమును, అధికముగా నిచ్చుచున్నది.

103. శ్లో. శతశ్లోకీబద్ధంసను కనకదుర్గాంకితపదం
గురూపన్యస్తంతత్పృథ్వి కనకదుర్గాస్తవమిదం
నిబద్ధంమాణిక్యైః కనకశతమానం భవతితే
యథాహ్యాద్యందేవిస్ఫుటపదవిభక్తంవిజయతామ్

తా॥ నూరు శ్లోకములుచేకూర్చబడిన, నను కనకదుర్గయుని యంకితముతో గూడిన ఈ కనకదుర్గాస్తవమును భూమియందు గురువు నుండి యుపదేశమును పొందబడినది. అనగా జగద్గురువులచే చెప్పబడినది. హే దేవిస్ఫుటమగు పదములతో విభజింపబడి మనోహరమయి కనకపదములతో గూడి నూరుయనెడి కొలతగలదియై, మాణిక్యముల వంటి శ్లోకములతో గూడియున్నది. ఈ స్తోత్రము దేవి నీది. ఇది సర్వోత్కృష్టగ నుండుగాక.



శ్రీ రామకృష్ణ ప్రింటింగ్ వర్క్సు, ఏలూరు.

అనన్త పద్మనాభేన శబ్దవేదాన్తసంవిదా కనకదుర్గా
నందలహరీ గ్రంథో భాషాంతరీ కృతః

శ్రీకృష్ణశాస్త్రిణః పౌత్త్రః సుబ్బాంబారామయోస్సుతః
సుబ్బలక్ష్మీ పతిర్విద్వాన్, రామసేవాధురంధరః

వేంకట్రామశ్చ శ్రీరామః శివరామశ్చ భాస్కరః
చతుష్టయేన పుత్త్రాణాం సంయుక్తశ్శాస్త్రసంపదా
కనకదుర్గాంబార్పణమస్తు!

వ్యాకరము - వేదాన్తము! ఈ రెంటియందు విశారదు
డగు అనన్త పద్మనాభునిచేత, కనకదుర్గానన్దలహరీ
గ్రన్థము - ఆన్ధ్రభాషలో వచనములో వ్రాయబడినది

ఈ యనన్త పద్మనాభశాస్త్రి, శ్రీకృష్ణశాస్త్రులవారి
పౌత్రుడు, సుబ్బలక్ష్మి రామశాస్త్రుల పుత్రుడు,
సుబ్బలక్ష్మికి భర్త, విద్వాంసుడు రామసేవా
ధురంధరుడు.

వెంకటరామకృష్ణశర్మ, శ్రీరామశర్మ, శివరామకృష్ణ
శర్మ, వెంకటభాస్కరసుబ్రహ్మణ్యమ్ అను పుత్ర
చతుష్టయంబుతోడ సమేయమగు శాస్త్ర ధనంబు
తోడనుకూడి అనన్త పద్మనాభశాస్త్రి పరికాశించు
చున్నాడు.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 4 | పుత్రై | పుత్రైః |
| 8 | 2 | యున్నది | నున్నది |
| 9 | 10 | దుర్గె! | దుర్గే! |
| 0 | 19 | సమసె | సమస్తై |
| 13 | 8 | చంద్రుని | చంద్రుఁని |
| 14 | 7 | సుధా | స్సుధా |
| 5 | 17 | నిపలితి | నిపతిత |
| 16 | 7 | సమ్మ్యాయు | సామ్మ్యాయ |
| 16 | 14 | సేవచేసి | చేయుస్తై |
| 7 | 1 | మెతటి | మెత్తటి |
| 8 | 16 | లావణ్య | ల్లావణ్య |
| 9 | 15 | సయ | సలయ |
| 22 | 12 | నున్నది | నుంటున్నది |
| 38 | 1 | ఏ కుంకుమ | కుంకుమ |
| 28 | 6 | కుర్వతో | కుర్వంతో |
| 9 | 16 | జ్యోతాన్యభి | జ్యోతాంసఽభి |
| 3 | 15 | వ్నది | వ్నదీ |
| 35 | 2 | శి స్సు | శిరస్సు |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 36 | 2 | స్నలజ్ఞా | స్నం జ్ఞా |
| 36 | 12 | పురుషార్ద | పురుషార్థ |
| 36 | 14 | వ్రదమగు | ప్రదమగు |
| 37 | 1 | వృశోయ | పృథ్వోయం |
| 37 | 2 | సకజల | సకలజల |
| 37 | 3 | ద్రషుం | ద్రష్టుం |
| 38 | 1 | స్రద్రాజఞా | స్రద్రాజ్ఞా |
| 38 | 18 | స్రకాశించు | ప్రకాశించు |
| 40 | 7 | కల్సాంత | కల్పాంత |
| | 12 | అవ్పుడు | అప్పుడు |
| 42 | 17 | అనే· | అనేన |
| 43 | 12 | భగపతి | భగవతి |
| | 15 | శ్రేష్టుల | శ్రేష్ఠుల |
| 44 | 4 | శ్రేయష్కరి | శ్రేయస్కరి |
| | 11 | వాధ్రె | వాధ్రే |
| | 13 | దుగ్గరె | దుగ్గరే |
| 45 | 4 | కవక | కనక |
| 45 | 17 | సమూహాముల | తుమ్మెదల సమూహాము |
| 45 | 19 | సురలను | సురులను |
| 46 | 4 | స్థలవతా | స్థలగతా |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 47 | 4 | సఃఖము | సుఖము |
| 47 | 12 | దూళి | ధూళి |
| 48 | 4 | ద్వారా | ద్వార |
| 50 | 1 | దమనే | ప్రమాణే |
| 51 | 12 | [illegible] | [illegible] |
| 51 | 12 | కటణం | [illegible] |
| 55 | 19 | దుర్గా! | దుర్గా |
| 56 | 10 | శియం | శ్రియం |
|  | 1 | నకదుర్గా | శ్రీదుర్గా |
|  | 4 | రిధ్వాన్ | రిద్వాన్ |
|  | 6 | శాస్త్ర | శాస్త్రి |
|  | 11 | శాస్త్రుల | శాస్త్రిల |

